అభివృద్ధిని తగ్గిస్తాయి ఆందోళన పెంచుతాయి కాబట్టి బుధునికి మీనం నీచ న్యాయబద్ధుడైన మేధావికి (గురుడు) రిస్క్ (అష్టమం) తో గూడిన ఆలోచన (పంచమం) అభివృద్ధినిస్తుంది ధనుస్సుకి అష్టమం (రిస్క్) మీనానికి పంచమం అయిన కర్కాటకం గురునికి ఉచ్ఛ

ధన కుటుంబాలు (ద్వితీయం) లాభం (11వ స్థానం) ఆందోళనకారులౌతాయి స్వార్థం పెంచుతాయి ధనుస్సుకి ద్వితీయం మీనానికి లాభస్థానం అయిన మకరం గురునికి నీచ కాంట్రాక్టరు (వృషభం)కి లాభం (11వ భావం) న్యాయవాది (తుల)కి విజయం (షష్ఠం) అతి ముఖ్యాలు వృషభానికి 11, తులకి 6 అయిన మీనం శుక్రునికి ఉచ్ఛ న్యాయవాదికి శయ్యా సౌఖ్యం (బద్ధకం) కాంట్రాక్టరుకి దయతో కూడిన ఆలోచన (పంచమం) ఆందోళన నిస్తాయి కాబట్టి వృషభానికి పంచమం తులకి వ్యయం అయిన కన్య శుక్రునకు నీచ

పట్టుదల సేవకునికి (మకరం) అధికారం (దశమం) బద్ధకస్తునికి (కుంభం) పుణ్యబలం (నవమం) అభివృద్ధినిస్తాయి. మకరానికి దశమం కుంభానికి నవమం అయిన తుల శనికి ఉచ్ఛ బద్ధకస్తుడైన సేవకునికి (కుంభం) జనసహకారం (సేవకునికి కొంచెం సహకరించి ఇతరులు ఎక్కువ పని చేయించుకుంటారు) (తృతీయం) పట్టుదల గల సేవకునికి (మకరం) ఆహార చింత, సుఖచింత (చతుర్థం) ఆందోళన నిస్తాయి మకరానికి చతుర్థం కుంభానికి తృతీయం అయిన మేషం శనికి నీచ ఈ సహేతుకత దృష్టి గ్రహాల స్వభావాలను విశదీకరిస్తోంది పండితులు పరిశీలింప కోరిక.

 

# స్థిర-ద్విస్వభావ-చరాలు జీవిత సత్యాలు

రాసులను వర్గీకరించినపుడు వేరు వేరు సత్యాలు గోచరిస్తాయి. రాసుల స్వభావాలు వాటి వరస క్రమం అంతా విచిత్రమైనది. సృష్టిక్రమం ఎంత లోతైనదో ఈ రాశిక్రమం గూడా అంత లోతైనది

| కవి. | సైనికుడు | బాధ్యతగల మంత్రి | కొనుగోలు దారు |
|---|---|---|---|
| బద్ధకం గల సేవకుడు | | | రాణి |
| పట్టుదలగల సేవకుడు | | | రాజు |
| వైజ్ఞానికుడు లక్ష్యసాధకుడు | గూఢచారి | తీర్పు చెప్పేవాడు | అమ్మకం దారు |




అనే రీతిలో మేషాది రాసుల ముఖ్య వ్యక్తిత్వాలను గుర్తించవచ్చు రవి, లగ్నం, చంద్రుడు ఈ ముగ్గురిలో బలవంతుడైన గ్రహం ఆయా రాసుల్లో ఉన్నప్పుడు ఆయా వ్యక్తుల వ్యక్తిత్వాలను గుర్తించవచ్చు

వీటిని వర్గీకరించినపుడు మూడు కోణాల్లో విభజింపవచ్చు సింహం నుండి మకరం వరకూ సమర్థవర్గం కుంభం నుండి కర్కాటకం వరకు అసమర్థ వర్గం.

సింహం రాజ్యపాలనలో సామర్థ్యాన్ని చూపితే వ్యాపారంలో అమ్మకం చేసే నేర్పు సామర్థ్యంగా పరిగణించబడుతుంది ఇరుపక్షాలకు అంగీకార యోగ్యంగా తీర్పు చెప్పడం గూడా విశిష్టమైన సామర్థ్యమే గూఢచారికి స్వయంగా అప్పటికప్పుడు నిర్ణయం తీసుకొనే సామర్థ్యం ఉండాలి వైజ్ఞానికునికి నూతనాంశాన్వేషణా సామర్థ్యం ఉండాలి పట్టుదల గల సేవకునికి కార్యాన్ని పూర్తి చేసే సామర్థ్యం ఉండాలి

బద్ధకించేవానికి, ఊహాలోకాల్లో పయనించే కవికి, చెప్పింది చెప్పినట్లు చేసే సైనికునికి, నేను బాధ్యత వహిస్తాను మీరంతా కల్పించుకోకండి అని తనకు తీరిక ఉన్నప్పుడు తనకు తోచిన రీతిలో పని పూర్తిచేసే మంత్రికి, కొనుగోలుదారుకు, రాణికి సామర్థ్యం కంటే కాలక్షేపమే ప్రధానమౌతుంది.



తమ శక్తి యుక్తుల్ని ఇతరుల ప్రయోజనం కోసం వినియోగించే వారు

ఇతరుల శక్తి యుక్తుల్ని తమ అభివృద్ధికివిని యోగించుకొనేవారు

## మరో వర్గీకరణ

వృషభం నుండి తుల వరకు ఇతరుల శక్తియుక్తుల్ని తమ సొమ్ము చేసుకునే వర్గం తమ శక్తియుక్తుల్ని ఇతరులిచ్చే సొమ్ము కొనం వినియోగించుకొనే వర్గం వృశ్చికం నుండి మేషం వరకూ బాధ్యతలు గల మంత్రి ఇతరులచే పనులు చేయిస్తూ పర్యవేక్షణ చేస్తాడు ఇతరులు పండించిన, కనుక్కొన్న, వ్రాసిన (కవిత్వాదులను) తాను కొంటాడు. రాణి ఇతరులచే పని చేయించుకుంటుంది. రాజు అందరి నుండి అన్ని శక్తులను వినియోగించుకుంటాడు. అమ్మకందారు అందరి ఉత్పత్తులను అనగా ఊహలను (మీనం) కనుకొన్న వస్తువులను (ధనుస్సు) ఆకర్షణీయంగా మలచి (కన్య) అమ్ముకొని లాభాలు తీస్తాడు తీర్పరి ప్లీడరు చెప్పిన విషయాలు ఉభయుల వాదాలు విని తాను తీర్పు చెపుతాడు. కాగా ఈ పైవారిలో ఇతరుల శక్తులను తమ అభివృద్ధికి వినియోగించుకొనే నేర్పు ఉంది

ఇక గూఢచారి, వైజ్ఞానికుడు సేవకుడు (మకరం, కుంభం) కవి సైనికుడు తమ శక్తియుక్తుల ద్వారా సాధించిన పనుల ప్రయోజనాలను ఇతరులకు అందిస్తారు

ఈ రెండు వర్గీకరణల సమ్మేళనంలో మరో వర్గీకరణ



1 సింహం కన్యా తులలవారు ఇతరుల శక్తి యుక్తులను పూర్తిగా పరిగ్రహించి వృద్ధి చెందుతారు

2 వృశ్చిక ధనుర్మకరాలవారు తమ నిర్ణయాలు ఆలోచనా శక్తిపై ఆధారపడి స్వతంత్రంగా కార్యసాధకులై ఆ ఫలితాలను ఇతరుల కందిస్తారు

3 కుంభ, మీన,మేషాల వారు ఇతరుల ఆదేశాలను అనుసరించి పనిచేస్తూ స్వయంగా నిర్ణయాలు తీసుకోలేక అస్వతంత్రులుగా ఉంటారు ఎంత గొప్పకవి అయినా ఇతరుల కోసం వారిని మెప్పించడం కోసం వారు కోరిన రీతిలో కవిత్వం రాయాలి

4 వృషభ, మిధున, కర్కాటకాలవారు ఇతరుల నుండి శక్తియుక్తులను స్వయంగా స్వీకరింపలేక వారు మనకు సహకరిస్తే బాగుండునని మనసులో కోరుకుంటూ వారందరి సహకారాన్ని అపేక్షిస్తుంటారు

ఈ విభజన తరువాత ఒక క్రమంగా గోచరిస్తుంది సామాన్యంగా వర్గీకరించే చర స్థిర ద్వి స్వభావరాసులు అని కాకుండా స్థిరరాశితో పై వర్గీకరణ ప్రారంభం అవుతూన్నందు వలన స్థిర ద్వి స్వభావ చర రాసులు అని వర్గీకరించ వలసి ఉంటుంది

సామాన్యంగా బాలుడు స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఉంటాడు తరువాత కొంతకాలానికి అభిప్రాయాలలో స్థిరత లోపించి సమయానుకూలంగా సర్దుకునే తత్వం

అలవడుతుంది వయస్సు పెరిగి అనుభవం పెరిగిన కొలదీ స్థిరభావాలు పూర్తిగా పోయి అస్వతంత్ర స్థితికి చేరుకుంటాడు అదే చరరాశి

బాలుడు స్థిరాభిప్రాయాలు వివాహానంతరం ద్వంద్వవైఖరి వృద్ధాప్యంలో మనుమల మాటకు కూడా విలువ ఇస్తూ స్వంతభావాలు లేని స్థితిని పొందుతాడు మరో కోణంలో ప్రపంచమంతా అస్థిరమని, అసత్యమని, చంచలమని గ్రహించిన జ్ఞాని ఆత్మజ్ఞాన సంపన్నుడౌతాడు భగవంతుడు కూడ జరుగుతున్న చిత్ర విచిత్రాలకు సాక్షిగా నిలుస్తాడు కనుకనే అతడు పరిపూర్ణ ప్రజ్ఞావంతుడు కాగా స్థిరత్వం ప్రాథమిక స్థితికి చరత్వం పరిపూర్ణ స్థితికి సంకేతాలౌతున్నాయి ఈ క్రమాన్ని పరిశీలించినప్పుడు



స్థిరం నుండి చరానికి చేసే ప్రయాణంలో మధ్యలో ద్విస్వభావం ఉంది. ఆ ద్విస్వభావంలో గూడా మొదటి సగం స్థిర ప్రాధాన్యంతోను రెండవ సగం చర ప్రాధాన్యంతోను (చరం వైపున్నందువలన) ఉంటేనే ఒక క్రమత గోచరిస్తుంది ఈ జీవిత సత్యాలను గమనిస్తే జాతకంలో ఆయా విభాగాల్లో ఉండే గ్రహాలిచ్చే ఫలితాలను గూడా నిర్దేశించడం సులభతరమౌతుంది ఇలాంటి సహేతుక దృక్పథంతో పరిశీలనలను ప్రోత్సహించే జ్యోతిష విజ్ఞాన భాస్కరులు బ్ర॥ వే మధుర కృష్ణమూర్తి శాస్త్రిగార్కి నమస్సులతో . . .



# నిత్యావసరరాలు - నిత్యసత్యాలు

| కవి<br>ఊహాశిలి నిద్ర | సైనికుడు | బాధ్యతగల<br>మంత్రి | కొనుగోలు<br>దారు |
|---|---|---|---|
| బద్ధకం గల<br>సేవకుడు | | | రాణి |
| పట్టుదలగల<br>సేవకుడు | | | రాజు |
| వైజ్ఞానికుడు<br>లక్ష్యసాధకుడు | గూఢచారి | న్యాయాధుతి | అమ్మకం<br>దారు |

అని రాశి కారకత్వాలను మనం అర్థం చేసుకోవచ్చు ఈ కోణంలో ఆలోచిస్తే సైన్యం బాధ్యత గల మంత్రి , రాణి, రాజు, న్యాయాధిపతి, గూఢచారి, సేవకుడు లేని జనసముదాయాన్ని ఊహించగలం కాని, వ్యవసాయం, కొనుగోలుదారు, అమ్మకందారు, వైజ్ఞానికుడు, ఊహాశిలి లేని జనసమూహాలను ఊహించలేము.

సైన్యాధికారి - రాజుకు కావాలి, బాధ్యత గల మంత్రి - రాజుకు కావాలి, రాణి - రాజుకు కావాలి, గూఢచారి - రాజుకు కావాలి, సేవకుడు - రాజుకు కావాలి. రాజు బాధితులైన

ప్రజలకు రక్షకుడుగా కావాలి ప్రజలలో కొందరు బాధితులు కావడానికి మరి కొందరిలోని అతి స్వార్థమే కారణం ఈ కోణంలో ఆలోచిస్తే బాధితులైన ప్రజలను సమర్థిస్తూ నైపుణ్యం గల వ్యక్తి నాయకత్వం వహించి పరిపాలకుడుగా వ్యవహరిస్తూ తన నాయకత్వాన్ని కాపాడుకోవడానికి బాధిత వర్గాన్ని (పెంచుతూ) కాపాడినట్లు నటిస్తూ, తన పదవిని కాపాడుకుంటూంటాడు అతిస్వార్థం లేని సమాజంలో పైవారి అవసరం నిత్యావసరం కాజాలదు

"అప్పిచ్చువాడు, వైద్యుడు
నెప్పుడు నెడతెగక బారునేరును ద్విజుడున్
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ'

అనే పద్యంలో అప్పిచ్చువాడు (అప్పిచ్చే అమ్మకందారు) కన్య సహకరించే వైద్యుడు (మిధునం) (బుధునికి వైద్యకారకత్వం ఉంది) ఎప్పుడు ఎడతెగక బారుఏరు (మీనం) ద్విజుడు (మేలుకోరే సలహాలిచ్చే గురువు ) (ధనుస్సు) అనేవారుగా అర్థం చేసుకుంటే సుమతీశతక కారుడు నిత్యావసరాలను గుర్తించిన కవిగా (మీనం) మనం గ్రహించవచ్చు

ఈ పద్ధతిలో విశ్లేషిస్తే మరణానంతరం లభించే మోక్షం, తాత్కాలికోద్రేక రూపమైన కామం పురుషార్థాలలో నిత్యావసరాలు కాకుండా పోతాయి ధర్మం, అర్థం నిత్యావసర పురుషార్థాలు గురువు/మేధావి ధర్మానికి ప్రాధాన్యమిస్తారు

జీవితంలోని సుఖదుఃఖాలు, మనోనిష్టాలు, ఇష్టం సుఖాన్ని అనిష్టం దుఃఖాన్ని ఇస్తాయని భ్రమిస్తూంటారు కాని సహజంగా ఆలోచిస్తే దుఃఖ సమయంలోగాని కోప సమయంలోగాని ఇష్టమైన పదార్థాన్ని అందిస్తే ఆ దుఃఖం, ఆ కోపం పెరుగుతాయే తప్ప తరగవు అలాంటి స్థితిలో సుఖదుఃఖాలు మనో నిష్ఠలే కాని పదార్థ నిష్టలు కావు

ధర్మానికి కారకుడు గురువైతే, మనోనిష్టమైన సుఖానికి కారకుడు ఊహాశీలియైన కవి. అదేవిధంగా ధర్మాన్ని ఆశ్రయించిన గురువు, మేధావి, వైజ్ఞానికుడు, కవి లోకానికి మేలు చేసేవారవుతారు కాబట్టి వారు నిత్యం అవసరమైనవారే వ్యవసాయదారు, అమ్మకందారు, కొనుగోలుదారు నిత్యజీవనంలో నిత్యావసర వ్యక్తులే

ఈ రీతిలో విశ్లేషిస్తే ద్విస్వభావ రాసుల వారు, పట్టువిడుపులు గలవారు చాలా ముఖ్యమైనవారు. పూర్తి చర స్వభావులు పూర్తి స్థిరస్వభావులు నిత్యావసర వ్యక్తులు కాలేరు సహజ భావ పద్ధతిలో ఆలోచిస్తే

| ఖర్చు అనుభవం మోక్షం త్యాగం | సామర్థ్యం | మాట విలువ | జన సహకారం |
|---|---|---|---|
| లాభం | | | గృహ వాహన సౌఖ్యం |
| రాజ్యం | | | ఆలోచన |
| సుఖానుభవం | ఆకస్మిక లాభాలు | జీవిత భాగస్వామి | సేవ ఉద్యోగం విజయం |

జనసహకారం, ఉద్యోగం (ఆహార సంపాదనకు ఉపకరించే శ్రమ) విజయం, అనుభవం, త్యాగం (ఆదర్శవంతుడైన కవి త్యాగశీలి కాగలడు ) అనే నాల్గు సహజభావాలే నిత్యావసరాలు తక్కినవి వ్యక్తి విలువను పెంచవచ్చే గాని జీవనంలో జీవాధారాలు కాలేవు అందుకనే ఉపచయాలలో తృతీయ షష్ఠాలకు ప్రాధాన్యం హెచ్చు

1 సామర్థ్యం - ఆరోగ్యం ఖర్చుతో గూడినవే

2 పోటీ విలువ కుటుంబఖర్చుతో గూడినవే

4 గృహ వాహన సౌఖ్యాలు కుటుంబ ఖర్చుతో గూడినవే

5 సంతానం వారి అభివృద్ధి కుటుంబఖర్చుతో గూడినవే

7 జీవితభాగస్వామి ఆమె అభివృద్ధి కుటుంబఖర్చుతో గూడినవే

10 రాజ్యం అభివృద్ధి (ఉపచయం) ఇచ్చేదైనా నిత్యావసరం కాదు

11. లాభం అభివృద్ధి (ఉపచయం ఇచ్చేదైనా అదే జీవితం కాదు

దీనిలో 1,2,3,5,7,8 భావాలు అపచయాలు, నిత్యావసరాలు కానివి చతుర్థంలో ఇల్లుంది కాని సుఖానుభవాన్నిచ్చే ఇల్లు,నవమంలో గూడా ఉంది చతుర్థంలో ఉన్న ఇల్లు ఆస్తి నవమంలోని ఇల్లు నివాస సౌఖ్యాన్నిచ్చేది (సొంతం కాకున్నా) అని అర్థం చేసుకోవచ్చు.

ఈ లెక్కన చూస్తే మనిషికైనా, ప్రాణికైనా, సహకారం, ఆహార సంపాదనకుపకరించే శ్రమ, ధార్మిక సుఖానుభూతి, త్యాగం నిత్యావసరాలు అవుతున్నాయి

విచిత్రమేమంటే త్యాగం సహకారానికి శ్రమ సుఖానుభవానికి పరోక్ష కారణాలౌ తున్నాయి అలాగే సహకారం సుఖానుభూతికి, త్యాగం శ్రమకి, రోగ నిరోధక శక్తికి, తాను




పడే శ్రమ ఇతరుల సహకారానికి త్యాగం సుఖానుభవానికి కారణాలౌతున్నాయి ఒక క్రమ పద్ధతిలో విశ్లేషిస్తే

నిత్యావసర గ్రహాలు, గురుబుధులు.

నిత్యావసర భావనలు, సహకారం, శ్రమ, సుఖానుభూతి, త్యాగం (త్యాగగుణం లేని లోభికి మలబద్ధక ప్రవృత్తి ఉంటుందని మనస్తత్వ శాస్త్రజ్ఞుల కథనం మాలిన్యాలను విసర్జించ లేకపోవడం అనారోగ్య కారకమౌతుందని వైద్యుల కథనం)

నిత్యావసర పురుషార్థాలు, ధర్మార్థాలు నిత్యావసర ప్రవృత్తి - ద్విస్వభావం తక్కిన వన్నీ వ్యక్తి ఔన్నత్యానికి, గర్వానికి, అధికార దుర్వినియోగాలకు, అనారోగ్యాలకు, ఆవేదనలకు, ఆందోళనలకు కారణాలు అని గుర్తించవచ్చు

ఈ విశ్లేషణను సహృదయంతో లోతుగా ఆలోచించి అనుకూల, వ్యతిరేక స్పందనలు ఆహ్వానించబడుతున్నాయి పరిపూర్ణ ప్రోత్సాహన్నిస్తున్న జ్యోతిష విజ్ఞాన భాస్కరులకు కృతజ్ఞతలు



# జైమిని దశలు

చరదశ : మేష, వృషభ, మిథునాలు, తులా, వృశ్చిక, ధనస్సులు విషమపద రాసులు తక్కినవి సమపద రాసులు మూడేసి రాసులు ఒక పదం మొదటి మూడు మేషాదులు 3వ మూడు తులాదులు విషమ పదరాసులను సవ్యంగాను, సమపదాలను అపసవ్యంగాను లెక్కించాలి

జన్మలగ్నం నుండి 9వ రాశి విషమపదమైతే, రాశిదశలు జన్మలగ్నం నుంచి సవ్యంగా లెక్కించాలి (9వ రాశి) సమపదమైతే రాశిదశలు లగ్నం నుండి అపసవ్యంగాను లెక్కించాలి ఆ లెక్కను అనుసరించి - మేష, సింహ, కన్యా,తుల,కుంభ,మీన లగ్నాలకు సవ్యంగానూ (ఉదాహరణకు మేష, వృషభ, మిథున ఇత్యాదిగా) వృషభ, మిథున, కర్క, వృశ్చిక, ధను, మకర లగ్నాలకు అపసవ్యంగాను (ఉదాహరణకు వృషభ దశ, మేషదశ, మీనదశ, ఇత్యాదిగాను) ఉంటాయి

రాశినుండి రాశ్యాధిపతి ఎన్నోరాశిలో ఉన్నాడో ఒకటి తక్కువగా అన్ని సంవత్సరాలు దశ ఉంటుంది ఈ లెక్కించడంలో గూడ ఆ రాశి విషమపదంలోనిదైతే సవ్యంగాను, సమపదం లోనిదైతే అపసవ్యంగాను లెక్కించాలి (ఉదాహరణకు : మేషంలో చంద్రుడుండగా కర్కాటక దశ పరిగణించేటప్పుడు కర్కాటకం, మిథునం, వృషభం, మేషం, మీనం కర్కాటకం

నుండి మీనం ఐదవరాశి కాబట్టి 4 సంవత్సరాలు కర్కాటక దశ అవుతుంది) రాశ్యధిపతి రాశిలోనే ఉంటే రాశిదశ 12 సంవత్సరాలు రాశికి అధిపతి ఉచ్ఛలో ఉంటే ఒక సంవత్సరం కలపాలి నీచలో ఉంటే ఒక సంవత్సరం తీసివేయాలి. కుంభ, వృశ్చికాల విషయంలో ఒక విశేషం ఉంది కుంభానికి అధిపతులుగా శని, రాహువులు, వృశ్చికానికి అధిపతులుగా కుజ, కేతువులు ఉన్నారు కాగా ఆ అధిపతులిద్దరు స్వక్షేత్రంలో ఉంటేనే ఆ దశ 12 సంవత్సరాలు ఉంటుంది వీరిలో ఒకడు స్వక్షేత్రంలోను మరొకడు వేరొక క్షేత్రంలోను ఉంటే ఇతర రాశిలో ఉన్నవాని రాశి సంఖ్యనే పరిగణించాలి

వారిరువురు (కుజ,కేతువులుగాని, శని,రాహువులు గాని) స్వక్షేత్రంలో ఉండక భిన్నరాసుల్లో విడిగా ఉన్నపుడు మరో గ్రహంతో యుతి పొందిన గ్రహాన్ని లెక్కలోకి తీసుకోవాలి

కుజ, రాహువులు కన్యలోను, శని, కర్కాటకంలోను ఉన్నపుడు కుంభాది (అపసవ్యం)గా షష్ఠంలో ఉన్న రాహువునే పరిగణనలోకి తీసుకుని 5 సంవత్సరాలు దశగా పరిగణించాలి రెండు గ్రహాలకు ఇతర గ్రహయుతి ఉంటే ఆ గ్రహాలున్న రాశిబలం పరిశీలించి ఎక్కువ రాశి బలమున్న గ్రహాన్ని లెక్కలోకి తీసుకోవాలి. రశ్మిబలం విషయంలో, చరరాశి కంటె స్థిరరాశి, బలమైనది స్థిరరాశి కంటె ద్విస్వభావరాశి బలమైనది రెండు రాసులకు బలం సమానమైతే ఎక్కువ సంవత్సరాలు వచ్చేదశ తీసుకోవాలి ఆ అధిపతుల్లో ఒకడు ఉచ్ఛ, ఒకడు నీచ పొందితే ఉచ్ఛలో ఉన్న గ్రహాన్నే పరిగణనలోకి తీసుకోవాలి

ప్రతిరాశి దశలో 12 అంతర్దశలు ఉంటాయి దశావర్షాలెన్ని ఉన్నాయో అంతర్దశ అన్ని మాసాలౌతుంది. దశాక్రమం ఎలా ఉంటుందో అంతర్దశాక్రమం కూడా అలాగే ఉంటుంది.

**నవాంశ దశ** ః ప్రతిరాశికి 9 ఏళ్ళు లగ్నం ఓజరాశి (బేసిరాశి) అయితే లగ్నాదిగాను సమరాశి లగ్నమైతే చరలగ్నానికి ఎనిమిదవ రాశి నుంచి, స్థిరలగ్నానికి 6వ రాశి నుంచి ద్విస్వభావ లగ్నానికి సప్తమరాశి నుంచి వరుసగా దశలుంటాయి. వాటిలో -

**కేంద్రాది దశ** ః లగ్న సప్తమాల్లో బలమైన రాశినుండి సవ్యంగా 1,4,7,10 రాసుల దశలో తరువాత వరుసగా 3,6,9,12 రాసుల దశలు వస్తాయి వీటిలో గూడ బలమైన రాశి దశ మొదట వస్తుంది నిర్బల రాశిదశ చివరికి వస్తుంది.

**నక్షత్రదశ** ః నక్షత్ర ప్రమాణం 12 భాగాలు చేయాలి. జననకాల చంద్రస్ఫుటం ఎన్నవభాగంలో ఉందో జన్మలగ్నం నుండి అన్నవరాశి దశ మొదటిది అవుతుంది జన్మలగ్నం బేసిరాశి అయితే సవ్యంగాను, సమరాశి అయితే అపసవ్యంగాను, వరుసదశలు వస్తాయి నక్షత్రంలో ఒక్కొక్కభాగం 1-6-40 డిగ్రీలు వస్తుంది

**మండూకదశ** : లగ్న సప్తమాల్లో బలమైన రాశి నుండి దశలు ఆరంభం అవుతాయి దశలు 1,5 9 2 6 10 3,7,11,4 8,12 రాసులు దశలు వస్తాయి చర, స్థిర ద్విస్వభావాల్లో చర రాశికి 7 సంవత్సరాలు, స్థిరరాశికి 8 సంవత్సరాలు, ద్విస్వభావరాశికి 9 సంవత్సరాలు దశాసంవత్సరాలుంటాయి కప్పదాటటం వలె చరం తరువాత స్థిరరాశికి ఆ తరువాత ద్విస్వభావానికి దశ వస్తుంది కాబట్టి మండూకదశ అన్నారు ఒకరాశి తరువాత దానికి కోణరాశి దశ వస్తుంది కాబట్టి కోణదశగా గుర్తుంచుకోవచ్చు

**దృగ్దశ** : లగ్నాత్తు 9వరాశి నుండి ఈ దశ ఆరంభమవుతుంది చరరాసులు 5,11 రాసులను స్థిరరాసులు 3,6,9 రాసులను ద్విస్వభావరాసులు 4,7,10 రాసులను చూస్తాయి లగ్నాత్తు 9వ రాశి బేసిరాసి అయితే ఆ రాశి నుండి సవ్యంగాను, సమరాశి అయిన అపసవ్యంగాను లెక్కించాలి లగ్నాత్తు తొమ్మిదవ రాశి బేసిరాశియై చరరాశి అయితే ఆ రాశి నుండి 1,5,11 రాసుల దశలు సవ్యంగా వస్తాయి సమరాశియై చరరాశి అయితే (అపసవ్యంగా) 1,11,5 రాసుల దశలు వరుసగా వస్తాయి

లగ్నాత్తు తొమ్మిదవ రాశి బేసిరాశి, స్థిరము అయితే 6,3,9 సవ్యంగా

" సమరాశి స్థిరము అయితే 1,3,9 అపసవ్యంగా,

" బేసిరాశి ద్విస్వభావం అయితే 1,4,7,10 సవ్యంగా,

సమరాశి ద్విస్వభావం అయితే 1,4,7,10 అపసవ్యంగా

దశలు వస్తాయి ఒక్కొక్క రాశికి 9 సంవత్సరాలు దశ ఉంటుంది.

మరో విధమైన వివరణ

1 లగ్నాత్తు 9వ రాశి దశ

2 నవమరాశి దృష్టిపడే రాసుల దశలు

3 దశమరాశి దశ

4 దశమరాశి దృష్టిపడే దశలు

5 ఏకాదశ భావదశ

6 ఏకాదశ రాశి యొక్క దృష్టిపడే రాసుల దశలు

వరుసగా వస్తాయి క్రమ నిర్ధారణ విషయంలో విషమరాశి అయితే క్రమంగాను, సమరాశి అయితే ఉత్తమంగాను పరిగణ చేయాలి. ఇది సామాన్య విషయంగాని, సింహ, కుంభ రాసులకు క్రమంగానే గణన ఉంటుంది మేష, తులలకు ఉత్తమంగాను, వృషభ, వృశ్చికాలకు క్రమంగా పరిగణన ఉంటుంది ద్విస్వభావ రాసుల్లో సామాన్య నియమాన్ని

అనుసరించి, విషమరాశి అయితే క్రమంగాను, సమరాశి అయితే ఉత్తమంగాను పరిగణన ఉంటుంది పై నియమాన్ని సులభంగా గ్రహించడానికి ఈ క్రింది నియమాలు ఉపకరిస్తాయి

1 చరరాసుల విషయంలో మొత్తం లెక్క ఉత్క్రమంగా చేయాలి

2 స్థిరరాసులలో క్రమంగా లెక్కించాలి

3 ద్విస్వభావ రాసుల్లో సమరాశి అయితే ఉత్క్రమంగాను, విషమరాశి అయితే క్రమంగాను లెక్కించాలి (డా సురేశ్‌చంద్ర మిశ్ర జైమిని సూత్ర వ్యాఖ్య - 143 పే)

ఒక ఉదాహరణ : లగ్నం కర్కాటకం, దానికి 9వ రాశి మీనం - ఇది ద్విస్వభావం కాగా మొదటి దశ మీనదశ ఈ రాశి యొక్క దృష్టి 4,7,10 స్థానాలపై ఉంటుంది (మిథునం కన్యా, ధనస్సులు) మీనం సమరాశి కాబట్టి ఉత్క్రమంగా లెక్కించాలి కాగా 2వ దశ ధనుస్సు దశ మూడవదశ కన్యాదశ, 4వ దశ మిథునదశ, 5వ దశ దశమాధిపతికి చెందిన మేషదశ 6,8,11 రాసులను చూస్తుంది ఈ మేషం చరరాశి కాబట్టి సమ విషమ ప్రశ్నలేదు ఉత్క్రమంగా లెక్కించగా 6వది కుంభదశ, 7వది వృశ్చికదశ, 8వది సింహదశ

9వ దశ ఏకాదశ భావానికి చెందిన వృషభదశ వృషభం స్థిరరాశి దీనినుండి క్రమంగానే లెక్కించాలి స్థిరరాశి 3 6,9 రాసులను చూస్తుంది కాబట్టి - 10వ దశ కర్కాటక దశ, 11వ దశ తులాదశ, 12వ దశ మకరదశ

**స్థిరదశ :** ఇది బ్రహ్మరాశి నుండి ఆరంభం అవుతుంది బ్రహ్మలగ్నం ఉన్న రాశి బ్రహ్మరాశి ఆ రాశి నుండి దశలు ఆరంభమవుతాయి దీనిలో చరరాశికి 7, స్థిరరాశికి 8, ద్విస్వభావ రాశికి 9 సంవత్సరాలు ఉంటాయి

**బ్రహ్మ గ్రహమంటే :** లగ్న, సప్తమాల్లో బలమైన రాశినుండి 6,8,12 భావముల అధిపతులలో ఏ గ్రహం విషమరాశిలో ఉంటాడో (వారిలో అధిక భాగాలు నడిచిన గ్రహం ముఖ్యం) అతడు బ్రహ్మగ్రహం లేదా లగ్నం నుండి సప్తమం, సప్తమం నుండి లగ్నం ఈ రెండు ఖండాలలో ఏ గ్రహం విషమరాశిలో (అధికభాగాలు నడిచి) ఉంటుందో ఆ గ్రహం బ్రహ్మగ్రహం రెండు గ్రహలు ఒకే రాశిలో ఉంటే వారిలో బలిష్ఠ గ్రహం బ్రహ్మగ్రహం అవుతుంది

**త్రికోణదశ :** లగ్న, పంచమి, నవమాల్లో బలీయమైన రాశినుండి దశలు ఆరంభమవుతాయి. ఆరంభదశ విషమరాశి అయితే క్రమంగాను, నమరాశి అయితే ఉత్క్రమంగాను నడుస్తాయి దశా సంవత్సరాలు చరదశలో వలెనే లెక్కించాలి దశల క్రమం 1,5,9/2,6,10/3,7,11/4,8,12 అనే వరుసలో వస్తాయి.

రాశి బలం

అగ్రహాత్ సగ్రహో జ్యాయాన్, సగ్రహేష్వధిక గ్రహః
సామ్యేచరస్థిర ద్వంద్వాః క్రమాత్స్యుః బలశాలినః
లగ్నత్రికోణేయోరాశి ర్బలవానుక్త హేతువుః
తదారభ్యోన్నయేత్రీమ చ్ఛరపర్యాయపద్ధశా
క్రమోత్క్రమాభ్యాం గణయేదో జయుశ్మేషు రాశిషు
క్రమాత్ వృషే వృశ్చికేచ వ్యుత్క్రయుత్కుంభ సింహయోః

**వర్గదశ :** లగ్నం బేసిరాశి అయితే మేషం నుండి సవ్యంగాను, సమరాశి అయితే మీనం నుండి అపసవ్యంగాను, లెక్కించి ఆ సంఖ్యను హోరాలగ్న సంఖ్యను కలుపుట గాని, తీసివేయుటగాని చేయాలి.

**హోరాలగ్నమనగా :** సూర్యోదయానికి జన్మకాల ఘడియలను 12చే హెచ్చించి ఆ సంఖ్యను లగ్నం బేసిరాశి అయితే సూర్యుని భాగాలకు సరిరాశి అయితే లగ్నభాగాలకు చేర్చి లెక్కించగా హోరాలగ్నమగును. (ఇది కూడ బేసిరాశి అయితే మేషం నుండి సవ్యంగాను, సమరాశి అయితే మీనం నుండి అపసవ్యంగాను లెక్కించాలి) రెండు బేసిరాసులైనా రెండు సమరాసులైనా హోరా లగ్న సంఖ్యతో కలపాలి. హోరాలగ్న, జన్మలగ్నాలు ఒకటి సమరాశి ఒకటి బేసిరాశి అయితే, రెండింటికీ గల భేదం తీసుకోవాలి. లగ్నం బేసిరాశి అయితే మేషం నుండి సవ్యంగాను సరిరాశి అయితే మీనం నుండి అపసవ్యంగాను లెక్కిస్తే, వర్గద లగ్నం వస్తుంది. ఇదే రీతిగా ఇతర భావాలకు కూడ వర్గద రాసులను నిర్ణయించాలి. రెండవ భావ వర్గదను కనుకొనడానికి లగ్నం నుండి రెండవరాశికి హోరాలగ్నం నుండి రెండవరాశికి లెక్కించాలి. ఈవిధంగా వర్గదలగ్నం మరియు వర్గదభావాలు నిర్ణయించి లగ్నం బేసిరాశి అయితే సవ్యంగాను, సమరాశి అయితే అపసవ్యంగాను లెక్కించాలి.

 

# రాసులు - రీతులు

అగ్ని : చైతన్యానికి సంకేతం - మేషం, సింహ, ధనస్సులు

వాయువు : మనస్సుకు సంకేతం - మిథున, తుల, కుంభాలు

జలం : (ఆత్మ) ఆత్మేంద్రియమైన - ఆధ్యాత్మికాంశాలు, అతీంద్రియానుభవాలు, కర్కాటకం, వృశ్చికం, మీనం

భూమి : శరీరానికి సంకేతం - వృషభం, కన్య, మకరం.

చర రాసులు : నిత్యోత్సాహం, చైతన్యవంతం అయినవి. తెలివైనవి, ఉత్సాహం కలవి.

స్థిరరాసులు : నిశ్చయాత్మకత, పట్టుదల, ప్రభుత్వం, గాంభీర్యం ప్రధానంగా కలవి.

ద్విస్వభావ రాసులు : ఇతరులు చెప్పింది వినడం, నిర్లిప్తత, ద్విస్వభావం, ఉత్సాహం, గాంభీర్యం కలిసి ఉంటాయి.

మానవరాసులు : మిథున, కన్యా, తుల, కుంభాలు

మృగరాసులు : మేషం, ధనస్సులో మొదటిభాగం, మేష,మిథున, సింహ, మకరాలు, హింసాత్మక వైఖరి, తీవ్రస్పందన కలవి.

సఫల రాసులు : వృష, కర్కాటక, వృశ్చిక, ధనుర్మీనాలు.

మేష : మిథున కన్యా, సింహాలు.

మూక (జల) రాసులు : కర్కాటకం, వృశ్చికం, మీనం.

సశబ్ద (వాయు) రాసులు : మిథునం, తుల, కుంభం

ముఖ్యభాగాలు : సెన్సిటివ్ పాయింట్స్

చరరాసుల్లో - 1,13,26

స్థిరరాసుల్లో - 9,21

ద్విస్వభావ రాసులు - 4,17.

సందేహాస్పద జాతకాల్లో సరిచేయడానికి ఇవి పనికి వస్తాయి.

## ముఖ్య లక్షణాలు

మేషం : శారీరక లక్షణాలు : పొడవైన మెడ, పొడవైన కోలముఖం (కండలేనిది), సన్నని చిబుకం, బిరుసు వెంట్రుకలు, ముఖంపై మచ్చగాని, గాయపు చిహ్నంగాని, ఉంటుంది. విశాలమైన నుదురు.

మనస్సు : శక్తికి మించిన కోరికలు, ధైర్యం, చిరాకు, ప్రాముఖ్యం వహించాలనే కోరిక, (నాయకత్వ వాంఛ) క్రొత్త, క్రొత్త ప్రయత్నాలలో ఉత్సాహం, యదార్థభాషణం, మొండి ధైర్యం, సాహసం.

వృషభం : శరీరక లక్షణములు : లావైన మెడ, భుజములు కొంచెం వంగి ఉండటం, ఆలోచనతో ముడివడిన కనుబొమ్మలు, పెద్ద పెదవులు నాసికపుటములు, నొక్కులజుట్టు (కర్లింగ్ హెయిర్) పెద్ద నుదురు, నల్లని కన్నులు, బలమైన దవడలు, బూరిబుగ్గలు.

మానసిక : భోగవాంఛ, సుఖాలు, పట్టుదల, శ్రమించే అలవాటు, ఓర్పు, అభిజాత్యం, విద్య మొదలైన వాటివల్ల గర్వం, పట్టిన పట్టు వదలకుండా ఉండడం.

మిథునం : శారీరక లక్షణాలు : పొడవు, పలుచని శరీరం, పొడవైన ముఖం, విశాలమైన నుదురు, పొడవైన వేళ్ళు, చక్కని ముక్కు, పొడవైన ముక్కు.

మనస్సు : పాదరసం లాంటి గుణం, నిరంతర ఉత్సాహం, చలనశీలం, భావాన్ని ప్రకటించే కనులు, కళాశక్తి, కళాభినివేశం, విద్యాధికత, చేతి పనులలో నైపుణ్యం, కొత్త విషయాలు కనుగొనడం, ప్రతివిషయంలోను కౌతుకం, మాటకారితనం, రచనాశక్తి, నిరంతర

క్రియాశీలం, తీరిక లేకుండటం, మానవతావాదం.

కర్కాటకం : శారీరక లక్షణాలు : వెడల్పైన నుదురు, విశాలమైన వక్షస్థలం, గుండ్రని శరీరం, భారంగా నడవడం, దొర్లినట్లు నడవడం, ఊగుతూ నడవడం, నిండుముఖం, కండబట్టిన శరీరం, రెండుగా విడిన చిబుకం, నడుము నుండీ పైభాగం బరువుగా ఉండడం, చేతులు కాళ్ల సన్నగా ఉంటాయి.

మనస్సు : చంచల స్వభావం, ఆశ, సంఘంతో సంబంధ ఎక్కువ, ధనం విషయంలో జాగ్రత్త, సామభూతి, ఊహాశక్తి, శృంగారాసక్తి.

సింహం : శారీరక లక్షణాలు : బలమైన శరీరం, విశాలమైన భుజాలు, నిటారుగా నడవడం (గంభీరమైన నడక) ఉత్సాహవంతమైన ముఖం, సంతోషంతో కళ్ళలో నిర్భయం, ఉంగరాల జుట్టు (నొక్కుల జుట్టు)

మనస్సు : విశ్వాసపాత్రత, గర్వం, నిర్భయత్వం, ఆశ, ఔన్నత్యం, సాధించాలనే కోరిక, ఔదార్యం, ప్రతిపనిని కళాత్మకంగా చేయడం, రహస్యాలు, కుట్రలు సహించని స్వభావం, భావాల్లోను, జీవనంలోను, నిండుదనం.

కన్య : శారీరక లక్షణాలు : విశాలమైన నుదురు, వెనుకకు చెవుల మీద పడేటట్టున్న జుట్టు, బట్టతలకు అవకాశం, చక్కని ముక్కు, వెడల్పైన భుజాలు, శీఘ్రమైన నడక, మృదువైన కంఠస్వరం, విద్య.

మనస్సు : జ్ఞానాన్వేషణ, పద్ధతిననుసరించి ప్రవర్తించడం, కళ, సాహిత్యం మొ॥ ఆసక్తి, దయాశీలం, జ్యోతిషం మొ॥ అంశాలపై ఆసక్తి, విమర్శనాత్మక బుద్ధి, తూచినట్లు మాట్లడటం, అతికినట్లు మాట్లాడడం.

తుల : శారీరక లక్షణాలు : పొడవు, నాజూకైన విగ్రహం, మధ్యవయస్సులో స్థూల శరీరం, మొటిమలు, చక్కని పలువరస, చక్కని వేళ్ళు,గోళ్ళు, మధ్యపాపిడ లేదా కొంచెం పక్కకి పాపిడి, ముక్కు పొడవు.

మనస్సు : దయాస్వభావం, సంతోషం, ఉత్సాహం, విద్యాధనాలను ప్రదర్శించే స్వభావం, న్యాయం, ఎదుటివారిని ఒప్పించే నేర్పు, అనుకరణశక్తి, కళాత్మకమైన దృష్టి, నాజూకు, క్రమ బద్ధమైన జీవనం, శృంగారంలో చాంచల్యం, విషయాసక్తి.

వృశ్చికం : శారీరక లక్షణాలు : నల్లని ఉంగరాల జుట్టు, అదుపులో లేని జుట్టు, చంపలు దట్టంగా ఉంటాయి. పాదాల్లోగాని, నడుముకు క్రిందిభాగంలో గాని, దోషయుక్తమైన అవయవాలు, పాదాలు పొట్టిగా, సన్నంగా ఉండడం, కనుబొమ్మలు ముఖంలో ప్రధానంగా కనిపించడం, చతుష్కోణాకృతిలో ముఖం.

మనస్సు : ధైర్యం, ఆత్మవిశ్వాసం, వివాదాల విషయంలో ప్రీతి రెచ్చగొడితే విరుచుకు పడే స్వభావం, ఇతరులు తమ జోలికి వస్తే ఊరుకోరు. వ్యంగ్యంగా మాట్లాడడం, చిరాకు, పట్టుదల, మారని భావాలు ఇతరుల అభిప్రాయాలు వీరిపై రుద్దడానికి అంగీకరించరు. మార్మిక విషయాలపై ఆసక్తి, పరిశోధన, జ్యోతిషాది శాస్త్రాలపై ఆసక్తి.

ధనస్సు : శారీరక లక్షణాలు : పొడగరి, నిండైన విగ్రహం, మెడకొద్దిగా వంగి ఉండడం, పొడవైన ముఖం. చక్కని నుదురు. భావ స్ఫోరకములైన కన్నులు, వ్యాయామము, క్రీడలు మొ॥ ఆసక్తి.

మనస్సు : ఔదార్యం, సత్స్వభావం, శాంతస్థితి, న్యాయశీలి, యదార్థవాది, స్నేహశీలి, మతము వేదాంతము మొ॥ ఆసక్తి, హేతువాదముయందు కంటె విశ్వాసమునందు మొగ్గే మనస్తత్వం, సంచారమునందు ప్రీతి (ప్రయాణమందిష్టం)

మకరం : శారీరక లక్షణాలు : ప్రముఖంగా కనిపించే ముఖ్య లక్షణాలు, పొడవైన ముక్కు, కొనలోపలికి వంగి ఉంటుంది. (గ్రద్దముక్కు) కొనదేలిన గడ్డం, సన్నని మెడ, మోకాళ్ళలో ఏదేని లోపం.

మనస్సు : ప్రతి పనిని మనస్ఫూర్తిగా చేయడం, తనకిష్టం లేని పనులు చేయకపోవడం, ఏదేని ఒక లక్ష్యం కోసం పాటుపడడం, ఉన్నతిని సాధించాలనే పట్టుదల, ప్రభుత్వోద్యోగమందు కాంక్ష, గాంభీర్యం, ఎప్పుడెలా ప్రవర్తిస్తాడో నిర్ణయించడానికి శక్యం కాని వాడు, ఏకాంతాన్ని కోరేవాడు, పట్టుదలతో కార్యాన్ని సాధించేంతవరకు వదలిపెట్టనివాడు, చపలుడు.

కుంభం : శారీరక లక్షణాలు : పొడవు, నిండైన విగ్రహం, కోలముఖం, పళ్ళకు సంబంధించిన దోషం, అందం (స్ఫురద్రూపం)

మనస్సు : దయ, మానవత్వం, ఓర్పు, సాహిత్యం, విజ్ఞానం మొ॥ వాటిపై ప్రేమ, సంగీతంలో ప్రవేశం, సరళస్వభావం, తనచుట్టూ మానవత్వాన్ని ప్రభావితం చేసే విషయంలో ఆసక్తి, ప్రేమ అన్ని విషయాల్లోను మానవతా దృక్పథం, కొందరిపట్ల ప్రత్యేకాభిమానం, మంచి స్నేహితులు కలిగి ఉండడం.

మీనం : శారీరక లక్షణాలు : పొట్టి, ముసలియైన శరీరం, బలహీనంగా కనిపించే ముక్కు, నీరుతో నిండిన కళ్ళు, చిన్నకాళ్ళు, చేతులు, పొట్టి అవయవాలు, మెడవంగిన ఆకారం.

మనస్సు: ఏదీ పట్టించుకోకుండా (బాధ్యతారహితంగా) ఉండే ఔత్సాహిక జీవనం, భోగపరాయణత్వం, రహస్యాలు (బైటపెట్టని) గల జీవనం, ఇతరుల కర్థం కాని మనస్తత్వం, రెండురూపాలతో కూడిన జీవనం, ఏ విషయం అయినా తీవ్రంగా అర్థం చేసుకొనే శక్తి, సరియైన నిర్ణయం చేసే శక్తి, బహుముఖ ప్రజ్ఞ మొదలైన లక్షణాలు కలిగి ఉంటారు.

# సేవ

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

బంధమోక్షాలకు కారణం మనస్సే. ఆనందం దుఃఖం పరస్పర విరుద్ధాలు. వ్యక్తి కోరేది ఆనందం. కృషిచేసేది దుఃఖం కోసం. దీనికి కారణం భ్రమ, సుఖం కోసం కృషి చేస్తున్నాననుకుంటాడు. దుఃఖం కోసం పని చేస్తుటారు. దుఃఖదాయకమైన కర్మను పాపకర్మలు అని, సుఖదాయకమైన కర్మను పుణ్యకర్మ అని అంటుంటారు. సుఖదుఃఖాలను నిర్వచించడం కష్టం. ఒక వ్యక్తికి సుఖమైనదే మరో వ్యక్తికి దుఃఖమైనట్లుగా ఒక సందర్భంలోని సుఖం మరో మరో సందర్భంలో దుఃఖమౌతుంటుంది. అతిసామాన్యంగా మనకిష్టమైన వస్తువు సుఖమను కుంటాం. ఇష్టం కానిది దుఃఖమని భావిస్తాం. కాని మన మనస్సు ఆనందంగా ఉంటే ఇష్టం లేని పని గూడా దుఃఖాన్నివ్వదు. పసిపిల్లవాడు తన్నాడు. అది దుఃఖాన్నివ్వదు. (అదే పని తెలిసినవాడు చేయబోయాడు అది దుఃఖాన్నిస్తుంది). కోపంగా ఉన్నప్పుడు మనకిష్టమైన వస్తువు మనకిస్తే అది కోపాన్ని, దుఃఖాన్ని ఇస్తుంది. ప్రతివ్యక్తి నిరంతరం పని చేస్తూండాలి. ఆ పని సుఖానికి ఆనందానికి కారణం కావాలి అంటే తప్పనిసరిగా ఆ పనికి సంబంధించిన ప్రయోజనం పైన దృష్టి ఉండరాదు. ఏది చివర దీపం తేజస్సుతో ప్రకాశిస్తుంది. ఆ ప్రకాశం ఆనందానికి, జ్ఞానానికి సంకేతం. దాన్ని మనం చేరుకోవాలి అంటే అక్కడికి వెళ్ళాలి. ఆ దీపాన్ని చూస్తూ మనం నడిస్తే రోడ్డు మీద ఉన్న గొప్పలు గోతులు మన గమనాన్ని నిరోధిస్తాయి. ఆ దీపాన్ని చూడకుండా మనం రోడ్డువైపు చూస్తూ నడిస్తే గమ్యాన్ని చేరుకుంటాం.

వేదం అంటే జ్ఞానం. ఆ వేదాల లక్ష్యాలను స్పష్టం చేసేవి ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తుల సారాంశం భగవద్గీత. భగవద్గీత వేదాంతాన్ని ఉపదేశిస్తుంది. కాని భగవద్గీత యొక్క సారాంశం లక్ష్యం ఏమిటి? భగవద్గీత అంతా విని అర్జునుడు ఏం చేశాడు? యుద్ధం చేశాడు. యుద్ధం అక్కడ స్వధర్మం. యోగవాశిష్టం అంతా విన్నాక రాముడు వివాహం చేసుకున్నాడు. వేదాంతం కర్తవ్య కర్మను శాసించేదే కాని కర్మ పరిత్యాగాన్ని బోధించేది కాదు.

స్వధర్మే నిధనంశ్రేయః. అంటాడు కృష్ణుడు. తన కర్తవ్యం తాను చేయాలి. కర్తవ్యం అంటే ప్రయోజనం కోసం చేసే పనికాదు. మనకు 5 ఇంద్రియాలున్నాయి. అవి సుఖానుభవానికి ఉపకరిస్తాయి. 5 కర్మేంద్రియాలున్నాయి. వాటిలో రెండిటి క్రియ శరీర రక్షణ మరి మూడింటి క్రియ శరీర పోషణకు కావలసిన పనులు చేయడానికి ఉపకరించేవి. అయితే ఈ మూడు ఇంద్రియాలు సక్రమంగా పని చేయాలన్నా ఆ చేసిన పనులు ఆనందాన్నివాలన్నా మనం చేసే పనులు పాపాలనిచ్చేవిగా ఉండకూడదు. కాని మన శరీరం నిలబడడానికి మనం చేసే కృత్యాలన్నీ పాపాలను కలిగించేవే అవుతున్నాయి. మనం నడుస్తూంటే జీవులు కొన్ని మరణిస్తున్నాయి. మనం చేత్తో చేసిన పనులు చాలావరకు పాపాలనే ఇస్తున్నాయి. కూరలు తరిగితే, అన్నం వండితే, నోటితో మాట్లాడితే కొన్ని కొన్ని జీవులును నశింపచేస్తున్నాం. మాంసాహారమే జీవహింస అనుకోవడం చాలా పొరపాటు. ఒకరోజు వండిన అన్నంలో ఎన్ని జీవులను నశింపజేస్తున్నాం? విత్తనాలలో జీవం లేదా? ఇలా నిరంతరం పాపాలే చేస్తూ సుఖానుభవాన్ని కోరుకుంటున్నాం. ఇది న్యాయమా?

పూర్వం గురుసేవ చేయడానికి చేతులను వినియోగించేవారు. ఇప్పుడు బంధువులో, లేక మనతో పనిఉన్నవారో మనకు పని ఉన్నవారు మాత్రమే మన ఇంటికి వస్తారు. పోనీ ఇంటికి వచ్చిన వారందరినీ రానిద్దాం అంటే రోజులు కూడా బాగాలేవు. ఇంటివాసాలు లెక్కించే వారే ఇంటికి వస్తారు తప్ప ఇంటివారి క్షేమం కోరేవారు రావడం లేదు. 24 గంటలలో మనం మంచిపనికి ఎంతకాలం వెచ్చిస్తున్నాం అనేది ప్రశ్నార్థకమే.

మనం చేసే పని యజ్ఞం కావాలి. మనం ప్రతిరోజు భోజనం చేస్తున్నాం. దాన్ని యజ్ఞంగా చేయాలి. అంటే దేవుని నివేదన కోసం చేయాలి. ఆ ప్రసాదం స్వీకరించాలి. భగవంతునికి నివేదించకుండా (తెలుపుడు చేయకుండా) ఆహారం తింటే మన కోసం మాత్రమే మనం వంట చేసుకుంటే పాపం తిన్నట్లే అంటోంది భగవద్గీత. అలా తిన్నవాడు దొంగేనని వివరిస్తోంది. ఈ స్థితిలో మన కర్తవ్యం ఏమిటి?

ఆత్మా త్వం గిరిజామతిః . . . .

అలాగే దానం చేయనిరోజు దుర్దినం అని శాస్త్రం చెబుతోంది. దానం వేరు దయవేరు.

దయలో అహంకారానికి కూడా అవకాశం ఉంది. అందుచేత దానం చేయాలి. ఉత్కృష్టునికి ఉత్కృష్ట భావనతో చేసేది దానం. అనారోగ్యవంతుడు అచేతనాకార్యం గల వ్యక్తికి మందుని దానం చేస్తే అనారోగ్యం త్వరగా ఉపశమిస్తుందని ఆయుర్వేదం చెపుతోంది. 7 జన్మలుగా దానం చేయని కుచేలుడు దానం చేయడానికి ఇష్టపడలేదు. అందుకే సంపద పొందలేకపోయాడు. భార్య దానం చేసే సంకల్పంతో అటుకులు పంపించింది. ఆ ఫలితాన్ని ఆమె పొందింది. ఆ సంపదను అనుభవించడానికి కూడా అతడిష్టపడలేదు. అలాగే సేవ ఒక దానం. అన్ని దానాల కంటే సేవకు ఎక్కువ ప్రాముఖ్యముంది. ఒకటి శారీరక శ్రమ, ప్రయోజనాపేక్ష లేని సేవ వలన ఆనందాన్ని కల్గించే రసాయనోత్పత్తి. అహంకార పరిత్యాగం దైవభావనతో సేవ చేయాలి. దైవభావనతో చేసిన సేవ భగవదనుగ్రహాన్నిస్తుంది. మనం ఇతరులకు ఆనందాన్నిస్తే మనకు ఆనందం కలుగుతుంది. సమాజమనే అద్దం కోపం చూపిస్తే కోపమే చూపిస్తుంది. ప్రేమ, గౌరవం చూపిస్తే వాటినే ప్రతిఫలిస్తుంది. ఈ సేవాభావం వలన సమాజానికి శ్రేయస్సు, మనసుకు ఆనందం, ఒక వస్తువు మనం తింటే దానివల్ల కలిగే ఆనందానికి పరిమితులున్నాయి. ఒక వస్తువుని కోరినపుడు కోరిక తీరేదాకా తింటే అజీర్ణం, తక్కువ తింటే అసంతృప్తి. అది తిన్నాక దానివలన కలిగే పరిణామాలు అనారోగ్యాదికాలు ఎక్కువ దుఃఖాన్నే కలిగిస్తాయి. అదే ఇతరులకు మనం ఇచ్చినపుడు వారనుభవిస్తున్న ఆనందాన్ని చూస్తూంటే మనకు కలిగే ఆనందానికి అవధులు లేవు.

సేవ ఎవరికి ఎలా చేయాలి. తల్లిదండ్రుల మాట వినడం, ఆచరించడం సేవ. ఆవుకి గడ్డి వేయడమే పూజ. భగవంతునికి పాదాభివందనం చేయడం వినయానికి సంకేతం. దరిద్రునికి కావలసిన సదుపాయాలు కల్గించడం సేవ. అన్నింటికంటె గొప్పది అనారోగ్యవంతులకు చేసే సేవ. వారు పూర్తి నిస్సహాయులు. వారికి సేవ చేయడానికి బంధువర్గీయులు కూడా శ్రద్ధ చూపరు. అట్టివానికి ఆదరంతో సేవ చేస్తే వారి మనసు పూర్తి ఆనందాన్ని పొందుతుంది. అది అసామాన్యం. నిరుపమానం. మనకు రోజుకి 24 గంటలున్నాయి. 7 గంటలు నిద్రకు తీసేస్తే మిగిలిన 17 గంటల్లో ఎన్ని గంటలు సేవకు వినియోగించగలమో నిర్ణయించుకోవాలి. భర్తకు సేవ చేసినా, తల్లిదండ్రులకు సేవ చేసినా ఇంటి పనులు చేసుకున్నా ఆదరంతో చేస్తే అది సేవ అవుతుంది. తప్పనిసరిగా చేసినా ఆదరంతో చేసినా శ్రమ సమానమే.

ఆదరంతో చేసిన పని వలన సేవ సత్ఫలితాలనిస్తుంది. అదే ప్రయోజనంతో ఏమాత్రం సంబంధం లేకుండా బైట వ్యక్తులకు సేవ చేస్తే అది కూడా అవసరమైన వ్యక్తులకు అవసరమైన వస్తువులందిస్తే అది పరిపూర్ణమైన ఆనందాన్నిస్తుంది. సేవాభావాన్ని పిల్లల్లో కలిగించడం ఒక ప్రత్యేకత. మనకోసం మనం పుణ్యాలు చేసుకోవడమే కాదు పిల్లలకు సక్రమ

ప్రవర్తన కలిగించడం మన బాధ్యత. పిల్లలకిచ్చే సంపద వారి కృషిపై వారు ఎదిగేలా చేయడమే. ఆధ్యాత్మికంగా ఎదగాలంటే ఏయే విషయాలు నేర్వాలో అవి చిన్న వయసులోనే నేర్వాలి.

సర్వభూతాలలో చేతనా స్వరూపమే అంటున్నాడు (భూతానామస్మి చేతనా) కృష్ణుడు. అందువలన సకల భూతాలకు చేసే సేవ చైతన్యదృష్టితో చేయాలి.

"దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం

బ్రహ్మచర్య మహింసాచ శారీరంతప ఉచ్యతే" (గీత-17-13)

దేవతలు, గురువులు, ప్రాజ్ఞులు, వీరిని పూజించడం శారీరిక శౌచం, ఆర్థిక శౌచం, ఋజుత్వం, వేదపోషణ, అహింస, శారీరక తపస్సులు.

"అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచయత్

స్వాధ్యాభ్యాసనం చైవ వాఙ్మయంతితి ఉచ్యతే" (గీత 17-14)

ఇతరులకు బాధ కలిగించని మాటలు, సత్యం, ప్రియం, హితం అయిన మాట వేదాభ్యాసం, స్తోత్రపారాయణ, భజన మొదలైనవి వాఙ్మయ తపస్సు.

"మనః ప్రసాద సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః

భవ సంశుద్ధిరిత్యేతత్ తపోమానస ముచ్యతే"

మనసు సౌమ్యంగా వుండడం, మౌనం, ఆత్మనిగ్రహం, భావశుద్ధి అనేవి మానసిక తపస్సులు. అనారోగ్యవంతులకు సేవచేయడం శారీరక, మానసిక ఆరోగ్యాలను కలిగిస్తుంది. సేవాభావంతో ఆరంభమైన పలు సంస్థలు సేవలను నిర్వర్తిస్తున్నాయి. కాని వానిలో భగవద్భావన కరవైనందువలన ఆదరం నానాటికి క్షీణిస్తోంది. భగవద్భావనతో మిళితమైనపుడు మనం చేసే సేవ పవిత్రమౌతుంది. పూర్వం మహర్షులు నడిపే గురుకులాలలో అతి బాల్యంనుండీ గురుసేవను అలవర్చేవారు. ఇప్పుడు ఆ అవకాశాలు లేవు. తల్లిదండ్రులను దైవాలుగా భావించి సేవించే విధానం ఆనాడుండేది. ఈనాడు పిల్లలకు తల్లిదండ్రులు భయపడే వాతావరణం ఏర్పడింది. పిల్లవాడు తన కాళ్లపై తాను నిలబడిన తరువాత ఇక తల్లిదండ్రులకు దగ్గరగా ఉండడానికి ఇష్టపడడం లేదు. ఇక సేవ చేసే అవకాశాలు ఉండడం లేదు. ఇట్లయినపుడు నేర్చుకునేదెప్పుడు ? అందువలన మనకు మనమే శాసకులమై మనస్సును శాసించుకుంటూ ఈ సేవాభావాన్ని అలవరచుకోవాలి. వైద్యుడు అనారోగ్యవంతునికి సేవ చేస్తున్నాను అనే భావనతో చేసినవుడు ఆదరంతో న్యాయబద్ధంగా చేయగలుగుతాడు. అంతమాత్రాన ధనం తీసుకోవద్దని కాదు. ధనదృష్టితో వైద్యం చేస్తే అది సద్వినియోగం కాక ధనాన్ని ఎక్కువగా ఆర్జించే ఉపాయాలను ఆలోచించి

తన వైద్య పరిజ్ఞానాన్ని దుర్వినియోగం చేసే అవకాశం ఉంది. అదే సేవాభావంతో చేసినపుడు ఆ ప్రమాదం లేదు. రోగిది అనారోగ్య శరీరం. అనారోగ్యాన్ని తొలగించి ఆరోగ్యవంతమైన శరీరాన్ని వైద్యుడిచ్చాడు. ఆ ఆరోగ్యవంతమైన శరీరాన్ని వైద్యుని వద్దనుండి రోగి కొనుక్కోవాలి. అంటే ఫీజు ఇవ్వాలి. అది ఇవ్వకపోతే ఆ శరీరంతో చేసే పుణ్యమంతా వైద్యునికి చెందుతుంది అని ధర్మశాస్త్రం చెబుతుంది. ఈ భావనవలన రోగి ఫీజు ఇచ్చితీరాలి. ఒకవేళ అతడివ్వకపోయినా వైద్యుడు బాధ పడవలసిన అవసరం లేదు. అంతకంటె విలువైన పుణ్యం దక్కుతుంది కదా!



# జానపద సాహిత్యంలో జ్యోతిర్వైద్యాలు

కాలం, దిక్కు, దేశం అనేవాటిని వివరించేది జ్యోతిషం. ఆ మూడిటి అవసరం ప్రతివ్యక్తికి ఉంటుంది. వాటిని వినియోగించుకోవడం నిత్యావసరం. భాష పుట్టక పూర్వంనుండీ వీని వినియోగం ఉందనక తప్పదు. వ్యక్తి యొక్క ఆలోచన ఆకాశంలోని కాంతి పిడాలను చూసినందువలన వికసించిందే. ఆకాశంలోని గోళాకారంలో ఉండే కాంతిపిండాలే మానవుడు చక్రం తయారు చేయడానికి ఊహనందించాయి. కాలగణనతో ఆరంభమైన గణితశాస్త్రం జ్యోతిషం ద్వారానే వికసించింది.

వ్యక్తియొక్క మనుగడకు ఆహారం అవసరం. ఆహారం వ్యక్తి శారీరక మానసిక పరిస్థితులను మారుస్తూంటుంది. ఆ ఆహారంగా వాడే పదార్థాలలోని లక్షణాలను అవగాహన చేసుకొన్న ఆదిమానవుడు ఆ పదార్థాలను మందులుగా వాడడం ఆరంభించాడు. జానపదులు తమ నిత్య జీవనంలో మందులను, కాలగణన పద్ధతులను తమ అవగాహనను అనుసరించి ఉపయోగించుకున్నారు. విశేషించి భారతదేశం వ్యవసాయ ప్రధానమైనది. ఆ వ్యవసాయానికి కాలగణన అత్యావశ్యకం. ఆ కాలగణనకు కార్తులు, నక్షత్రోదయాలు

గుర్తించాల్సిన అవసరం ఉంది. అందుకనే వర్షాలు, మొదలైన వాటిని అవగాహన చేసుకోడానికి సామెతల రూపంలో, గేయాల రూపంలో జ్యోతిషానికి ఒక ఆకృతి కల్పించారు జానపదులు. వాటిని వినియోగించు కున్నారు. చదువుకున్నవాని కంటె చాకలి మేలు అనే సామెత ఈ అర్థంలోనే ఉపయోగించ బడింది.

ఒక రాజుగారు వేటకు వెడుతూ జ్యోతిష్కుని సంప్రదించాడు. వర్షం కురుస్తుందా? కురవదా? అని. జ్యోతిష్కులు లెక్కలు వేసి వర్షం రాదని సెలవిచ్చాడు. రాజుగారు వేటకు బయలుదేరారు. చాకలి మూట ముల్లె సర్దుకుని చాకిరేవునుండి ఇంటికి వచ్చేస్తున్నాడు. రాజుగారితో "అయ్యా ! వేటకు వెడుతున్నారా? వర్షం దట్టంగా రాబోతుంది. ఇప్పుడెళ్ళ కండయ్యా!" అన్నాడు. జ్యోతిష్కుని వచనంపై విశ్వాసంతో రాజుగారు చాకలిమాట లెక్క చేయలేదు. వేటకెళ్ళారు. పూర్తిగా తడిసి ఇంటికి వచ్చారు. చాకలిని పిలిపించారు. వర్షం మాట నీకెలా తెలిసింది? అని అడిగారు. "మా గాడిద చెవులు నిక్కపొడిచింది. వర్షం వచ్చే ముందలాగే చేస్తుంది. అందుకే నేను బట్టలు తడవకుండా తిరిగి వచ్చేశాను" అన్నాడు. ఈ గాథను తెలిపేదే ' చదువుకున్న వానికండే చాకలి మేలు' అనే సామెత.

అనుభవంలోంచి పుట్టిన మాటలు, భావాలు, నిత్యవాస్తవాలు. అలాంటి వైద్య సంబంధమైనవి లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. జానపద వాఙ్మయంలో, వాటిని సేకరించడం, అవి అనుభవంలో ఎలాంటి ఫలాలనిస్తున్నాయో పరిశీలించడం, ఆ వాక్యాలకు ప్రస్తుత వైజ్ఞానిక సంపద ఎలాంటి విలువనిస్తుందో గమనించడం చాలా అవసరం. ఆ వాఙ్మయం ప్రజలనోటిలో మాత్రమే వికసిస్తూ వస్తోంది. జానపదులు, గిరిజనులు, నాగరికత వైపు మొగ్గు చూపుతూండడం వల్ల ఆ విజ్ఞానం క్రమక్రమంగా నశిస్తోంది. దానిని కాపాడుకోవలసిన బాధ్యత మనందరిపైనా వుంది.



# దీపావళి

దీప - ఆవళి. దీపాల వరుస అని ఈ పదానికి అర్థం. కాంతి జ్ఞానానికి, ఆనందానికి సంకేతం.

"దీపంజ్యోతి పరంబ్రహ్మ
దీపం సర్వతమోహరం
దీపేన సాధ్యతే సర్వం
సంధ్యాదీపం నమోస్తుతే"

దీపం పరబ్రహ్మ స్వరూపం. అన్ని చీకట్లను హరిస్తుంది. దీపం ఉంటేనే ఏ పనైనా చేయగలం అనే భావన సంప్రదాయబద్ధమైనది. దీపావళిని ఆంధ్రులు 'దివ్వెల పండుగ' అని కూడా వ్యవహరిస్తారు.

ఆశ్వయుజ బహుళ అమావాస్య - దీపావళి. దీన్ని కొందరు మూడు రోజుల పండుగగా చేస్తారు. కొందరు ఐదు రోజుల పండుగగా చేస్తారు. త్రయోదశిని ధన త్రయోదశిగాను, అమావాస్యను దీపావళిగాను, పాడ్యమిని బలి పూజగాను, విదియను యమద్వితీయగాను, భగినీ హస్త భోజనం గాను నిర్వర్తిస్తారు.

"అయం జ్యోతిరమృతం మర్త్యేషు" అని దీపాన్ని అమృత స్వరూపంగా వేద వచనం చెపుతోంది. ఉత్సాహంగా ఉన్నపుడు దీపాలంకరణ చేసుకోవడం సకల జాతులలో ఉన్న అనుభవమే. లోక కంటకుడిగా మారిన నరకాసురుని వధానంతరం ప్రజలు ఆనందోత్సాహాలతో పండుగ జరుపుకున్నారని దీపావళికి సంబంధించిన పురాణ గాథ.

నరకాసురుడంటే - 'కం' అంటే సుఖం, 'అకం' అంటే దుఃఖం. దేనికంటే దుఃఖం లేదో అదే నరకం. నరకాసురుడు విధ్వంసాత్మకమైన ఆలోచనకు సంకేతం. అలాటి విధ్వంసాత్మకమైన ఆలోచనను సాముదాయికోత్సాహం, సాముదాయకానందం తొలగిస్తాయి. అలాటి నిరుత్సాహాన్ని ధ్వసం చేసి ఆనందోత్సాహాలతో పండుగ చేసుకోవడమే దీపావళి.

జ్యోతిశ్శాస్త్ర రీత్యా అహం కారానికి, నిరుత్సాహానికి కుజుడు ప్రతీక. కుజుడే నరకాసురుడని ఒక భావన. అహంకార నిరుత్సాహాలు నశింపజేసే ఈ ఉత్సవానికి దీపావళి (జ్యోతుల వరుస) సంకేతంగా భావించవచ్చు.

దీపావళినాడు బాణసంచా కాల్చడంలో ఆనందం, ఆరోగ్యం మిళితమై ఉన్నాయి. దీపావళికి బాణసంచా కాల్చేటప్పుడు వచ్చే గంధక ధూమం బ్యాక్టీరియాను నిర్మూలిస్తుంది. శబ్దాలకు పొగకు ప్రమాదకరమైన కీటకాలు చాలా వరకు పారిపోవడం, నిర్మూలన కావడం జరుగుతుంది. శ్వాసకోశ వ్యాధులు కలవారు, పొగ విపరీతంగా వచ్చే మతాబుల వంటివి కాల్చకూడదు. వాతావరణంలో వ్యాధి కారక క్రిముల్ని నిర్మూలించే దీపావళి బాణసంచాకు ఎంతో ప్రాముఖ్యం ఉంది.

- దీపావళి నాడు రాత్రి లక్ష్మీ పూజతో పాటు అర్ధరాత్రి ఇల్లంతా తుడిచి ఆ తుక్కును జ్యేష్టాదేవిగా భావించి దీపం చూపుతూ వీధిలో పొయ్యాలి. దీన్ని అలక్ష్మీనిస్సరణం అంటారు. ఇలా సంప్రదాయబద్ధమైన పండుగలు పలు ప్రయోజనాలనందిస్తాయి.



# నాగపంచమి

ప్రపంచంలో చాలా చోట్ల నాగపూజ చేసే ఆచారం ఉంది. అతి ప్రాచీన కాలంనుండీ ఈ ఆచారం ఉన్నట్లు భారతదేశంనుండి ఇతరదేశాలకు వ్యాప్తి చెందిందని కూడా చెపుతుంటారు. సింధునది లోయలో వెలసిన నాగరికత కాలం నుండి కూడా నాగపూజ ఉన్నట్లు తెలుస్తుంది. గృహ్యసూత్రాల్లో నాగపూజా విధానం పేర్కొనబడింది. నాగులకు భారతీయులకు గల సంబంధం విశిష్టమైంది. భారతీయ మతంతోను కళాజగత్తుతోను ఈ విషయం ముడివడి ఉంది.

నేపాల్‌లో నాగపూజ నారాయణ మందిరంలో చేస్తారు. ఇక్కడ వెలసిన గరుడ ప్రతిమ నుంచి ప్రతిసంవత్సరం శ్రావణ బహుళ పంచమి రోజున చెమట వస్తుందిట. పూజారులు దానిని వస్త్రంతో తుడిచి వస్త్రాన్ని రాజుకిస్తారు. ఈ వస్త్రంలోని ప్రతి నూలుపోగు పాము కాటు విషాన్ని ఉపశమింప జేయడానికి వినియోగిస్తారుట.

నాగులనే ఎందుకు పూజించాలంటే మనిషి మెదడు సర్పంపడగ ఆకారంలో ఉంటుంది. కుండలినీ శక్తిని గూడా సర్పరూపంగానే భావిస్తారు. కుండలినీ శక్తిని ప్రేరేపించి మూలాధారంనుండి బ్రహ్మరంధ్రం వరకు ప్రయాణింపజేయడం యోగసాధన ప్రక్రియ.

సాత్వికమైన మనస్సుతో పరమార్థ విచారణకు మనస్సును కేంద్రీకరించాలి. అందుకే ఉపవాసం ఆహారనియమం.

పాము సుబ్రహ్మణ్యస్వామికి ప్రతీక. సుబ్రహ్మణ్య పదంలో సు + బ్రహ్మణ్యః = మంచి బ్రహ్మణ్యుడు అనే అర్థం ఉంది. మంచి బ్రహ్మజ్ఞానానికి ప్రతీకగా భారతీయులు భావిస్తున్నారు.

పాము పుట్టనుండి వీచేగాలి స్త్రీలకు గర్భదోషాలను తొలగించే శక్తి ఉందని ఆయుర్వేదజ్ఞుల అభిప్రాయం. గర్భదోషాలు కలవారికి సర్పదోషం కలవారికి పాములు కలలో కనిపిస్తాయని స్వప్నశాస్త్రవచనం. లైంగిక అసంతృప్తులకు స్వప్నంలో సర్పదర్శనం అవుతుందని మనస్తత్వ శాస్త్రజ్ఞుల కథనం. నాగప్రతిష్ఠ, నాగపూజ ఆ దోషాలను తొలగిస్తుందని ధర్మశాస్త్ర నియమం.

లౌకిక జీవనంలో సంతానం ప్రధాన పాత్ర వహిస్తుంది. ఆధ్యాత్మిక జీవనంలో కుండలినీ ప్రేరణ ప్రధాన పాత్ర వహిస్తుంది. ఆధ్మాత్మిక జీవనంలో కుండలినీ ప్రేరణ ప్రధాన పాత్ర వహిస్తుంది.

ఆ రెండింటి సమన్వయం సుబ్రహ్మణ్య స్వామిక సంకేతం. ఆ కారణం వలన సంతానం కలగనివారు, విద్యరానివారు ఆధ్యాత్మిక జ్ఞానాభిలాషులు కూడా సుబ్రహ్మణ్య స్వామిని ఉపాసించడం భారతీయ సంప్రదాయం. నాగపూజ సందర్భంగా పుట్టమన్ను స్వీకరించడం ఆచారం. ఇది చెవులకు రాసుకోవడం వలన వినికిడి శక్తి పెరుగుతుందని నమ్మకం. ఆ మన్ను చర్మవ్యాధులకు పైపూతకు వాడితే చాలా మంచిదని ప్రకృతి వైద్యం చెపుతోంది.

దైవాలలో విష్ణువు శేషశాయి. శివుడు నాగాభరణుడు. గణపతికి పాము మొలతాడు. సుబ్రహ్మణ్య స్వామి సాక్షాత్తు నాగ స్వరూపమే. లౌకిక, పారమార్థిక రంగాలలోను శరీరారోగ్య విషయంలోను ఈ పాముయొక్క ప్రభావం ఉన్నట్లు గోచరిస్తుంది. మన శ్వాసశక్తిని పాముతో పోల్చినట్లు కనిపిస్తుంది. శ్వాస నియంత్రణ ద్వారా కుండలినీ జాగృతి పొందడం జరుగుతుంది. ఆ కుండలిని మూలాధారం నుండి వేరు వేరు స్థానాలను చేరినపుడు వేరు వేరు మనోభావనలపై నియంత్రణ తద్వారా మానసికారోగ్యం కలుగుతుంటుంది.

మూలాధారం - జీవితానికి,
స్వాధిష్ఠానం - జీవోత్పత్తికి,
మణిపూరం - ఆలోచనా శక్తిని పెంపొందించుకోవడం ఉపాసన మంచి నిర్ణాయకశక్తి
అనాహతం - విశ్వప్రేమ
విశుద్ధం - పరిశుద్ధత, స్వచ్ఛత
ఆజ్ఞాచక్రం - విశ్వ అవగాహన
సహస్రారం - జ్ఞానానంద సిద్ధి

అనే అంశాలలో విస్తృతిని అందిస్తాయి. వీనిలో ఆయా చక్రాల పరిధిలో గల అనారోగ్యాలను తొలగించడం ఆనందం సిద్ధింపజేయడం సహస్రారాన్ని చేరుకున్న తరువాత సంపూర్ణ జ్ఞానానుభవంతో మోక్షం పొందడం జరుగుతుందని యోగశాస్త్ర సంప్రదాయం.

ఈ విధంగా కూడా కుండలినీ సంకేతమైన నాగపూజ సంతానోత్పత్తికి, జ్ఞాన సముపార్జనకు ఆరోగ్యానికి, మోక్షానికి కూడా కారణమౌతూ వ్యక్తి సమగ్ర వికాసానికి సంకేతంగా నిలుస్తుంది.

3,484




## విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు

డా॥ సి.వి.బి.సుబ్రహ్మణ్యంగారు భారతీయ జ్యోతిషాన్ని, దానిలో నిగూఢంగా ఉన్న ఎన్నో అంశాల్నీ విదేశాలలో ప్రచారం చేసివచ్చినవారు. ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిషశాస్త్ర స్వరూపస్వభావాలను కూలంకషంగా అధ్యయనం చేసినవారు. భారతీయ జ్యోతిషంలోని గొప్పతనం కేవలం ఉపన్యాసాల ద్వారా విదేశాలలో ప్రచారం చేయడం మాత్రమే కాకుండా వాటినన్నింటిని అక్షర రూపంలో తీసుకువచ్చిన జ్యోతిషశిల్పి.

భారతీయ జ్యోతిషానికి సంబంధించిన పుస్తకాలు వ్రాసినవారెందరో ఉన్నారు. కానీ ఆ శాస్త్రంలోని నూతన పరిశోధనాంశాలను వ్యాసాల రూపంలో వ్రాసినవారు లేరు. ఆవిధంగా జ్యోతిష పరిశోధనా వ్యాసాలతో సంకలనం చేసిన మొట్టమొదటి గ్రంథం 'విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు'. జ్యోతిశ్శాస్త్రంలో పరిశీలించదగిన అన్ని అంశాలు జ్యోతిషానికి సమాజం, సంస్కృతి, సాహిత్యాలకు సంబంధించిన అంశాలు ఈ వ్యాసాలలో కనిపిస్తాయి. ప్రతివ్యాసంలోనూ ఏదో ఒక ప్రత్యేక అంశం ప్రతిపాదించబడింది. 'శ్రీరాముని జననం - వాదోపవాదాలు' అనే వ్యాసం నుండి 'నాగపంచమి' అనే వ్యాసం వరకు మొత్తం 47 వ్యాసాలతో కూడుకున్న గ్రంథం ఇది.

జ్యోతిశ్శాస్త్ర అధ్యయన శీలురకు, అధ్యాపకులకు, విద్యార్థులకు, అందరికీ ఉపయోగపడే విధంగా ఈ గ్రంథం తీర్చిదిద్దారీ రచయిత. ప్రతివిషయానికీ హేతువు వివరించడం, అన్వయించడం సుబ్రహ్మణ్యంగారి ప్రత్యేకత. ప్రతి ఒక్కరూ చదివి, అర్థం చేసుకొని ఆనందప్రదమైన జీవనాన్ని గడపడానికి ఉపయోగపడే గ్రంథం ఈ 'విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు'

**సాగి కమలాకర శర్మ**

విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు
విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు
విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు